Approved for Class use First. Gt. Dated 10-5-38

# CHILDREN'S POETRY-READERS

# బాలగీతావళి.

మొదటి తరగతి.



వేంకట పార్వతీశ్వరకవులు

A. P. G. NILAYAM. COCANADA.

# బాలగీతావళి.

## (మొదటితరగతి.)

వేంకటపార్వతీశ్వరకవులు.



ప్రకాశకులు:
ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,
కాకినాడ.



[వెల రు 0-2-

# PUBLISHERS' NOTE.

**Readers:**—Readers for boys and girls, vritten to suit the different stages of their rowth and mental development are a sad want of the day. They should help the children in acquiring and enlarging their knowledge of the common things of the home and its surrounding and should lead them from the known to the unknown. The lessons must be such as to foster enthusiasm n them, increase their thirst for knowledge nd develop their powers of understanding. 'opics out of harmony with nature and eas beyond their powers of understanding aould not, be forced upon them. The style iust be simple and the ideas intelligible to iable them to read and grasp the several oints quickly and intelligently. Just as bies fed on milk are step by step introuced to stronger and more varied diet, so oo, in education, children have to be led on o higher and more progressive courses of udy, only carefully and gradually. The troduction of more varied topics and fferent ideas must follow the plan natural radation and be designed to draw out the st in the children.

**Poetry and Prose:**—It is a matter of common experience with all that poetry is a better vehicle of instruction for children than prose in stimulating their knowledge of different subjects, in developing their reasoning power, in strengthening their retentive faculty, and in increasing their enthusiasm for knowledge. But in the reading books of the present day, lessons in prose and poetry are mixed up having no relation whatever either in respect of style or of ideas. This is quite true, as these lessons in poetry have never been designed like the prose lessons to suit the children. The authors of these reading books have compeletely missed this point. Their only anxiety is to include some lessons in poetry which, they know, are necessary to develop the mental powers but they fail to realise that it is educationally unsound to mix up lessons in poetry designed to extend their knowledge of subjects as well as to develop their memory and reasoning faculty, with lessons in prose which merely aim at imparting knowledge of subjects.

**Tendencies of child-hood:**—When children are in an ecstatic mood and when they feel compelled to express someting, they play-

fully sing out what they themselves imperfectly feel in their defective vocabulary, but always in measured tones. This is quite natural to children. This is true not only of children but also of birds when they happen to be in an ecstatic mood. It is thus clear that an ecstatic out burst of expression naturally comes out in rhythm and rhyme.

**Children and music:**—There is music in measured language and such music gives light. Such delight, the child begins to enjoy even while in the lap of its mother. It is lulled into sound sleep with the nursery rhymes of its mother and is easily fed only when she sings similar pleasing tunes. These nursery rhymes of the mother from the basis for the growth and development of the ideas in children. Hence to take advantage of the nasceat enthusiasm in children, to simulate the development of their tender minds, to make their imperfect ideas richer and fuller and to resist the development and perfection of their natural intelligence, it is essential that their lessons in poetry should be written so as to harmonize with the enthusiasm and experiences so natural to children at this state.

**Appeal:**—It is with this view that we have published these parts of "Children's Poetry Readers" (*Balageethavali*) and present them to the Andhra Public. These contain verses which interest the boys and girls just as their mothers songs and their own rhymes do. The style as well as the ideas are purposely simple. We are grateful to the Government and the Educated Public for having appreciated out efforts in this direction. We only pray that the Educational Athorities may reward our labours by giving us adequate encouragement.



# శ్రీరామచంద్ర.

# పీఠిక.

---

జననియొడిని విడిచి చదువులబడిం బ్రవేశించు పసిబిడ్డలకుం దాము తమతల్లియొద్దం బాడినపాటలును నాడినయాటలును గూడ గ్రంథరూపమునను, జిత్రరూపమునను బ్రదర్శించి వారి సహజజ్ఞానముతోం బాటుగ నక్షరజ్ఞానమును గలిగించుటకే యీ మొదటితరగతి బాలగీతావళి ప్రకటింపబడియెను. ఈపద్ధతి మనకు నవీనమైనది గాని యిట్టియుద్దేశముతోం బ్రకటింపంబడిన గ్రంథము లాంగ్లేయభాషయం దెన్నియో గలవు.

ప్రాథమికవిద్యావిధాయకమైయున్న యీసమయమున నివి బిడ్డలకు మహోపయోగకరములుగా నుండునను నుద్దేశముతోం బలువురు విద్యాశాఖాధికారుల యభిప్రాయము నను సరించి మే మీకార్యమునకుం గడంగితిమి.

మే మిదివఱకే ప్రకటించిన బాలగీతావళి 2, 3, 4, 5 తరగతుల పద్యపాఠగ్రంథములు విద్యాశాఖాధికారుల యనుమతిని బాఠశాలలయం దుపయోగింపంబడుచున్నవి.

ఇట్టి గ్రంథప్రకటనకుం బ్రథమమున మా కుద్దేశము గల్పించిన రావుసాహేబు శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులు వారికి మే మెంతయుం గృతజ్ఞులము.

విద్యాశాఖాధికారులీమా ప్రయత్నమును సఫలీకృతముగం జేసి మాకుం బ్రోత్సాహముం గూర్పవలయు నని ప్రార్థించుచున్నాము.

వేంకటపార్వతీశ్వరకవులు.

# బాలగీతావళి.

## మొదటితరగతి.

---

తప్పట్లోయి
తాళాలోయి
దేవుడుగుళ్లో
బాజాలోయి
పప్పుబియ్యం
దేవుడికోయి
పాలునెయ్యి
బాలుడికోయి

౭

గోరంత దీపమ్ము
కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్ము
గోవులకు వెలుగు
మూడంత దీపమ్ము
మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి
మా కళ్ల వెలుగు

౩

చందమామరావె
జాబిల్లిరావె
కొండెక్కిరావె
కోటివేలుతేవె
బండిమీదరావె
బంతిపూలుతేవె
పల్లకీలోరావె
పారిజాతంతేవె
తేరుమీదరావె
తేనెపట్టుతేవె
ఆటలాడరావె
ఆరగించిపోవె

౪

చిట్టీతపం డెరుపు

చిలకము క్కెరుపు

చింతల్లచిగు రెరుపు

జీడిపం డ్డెరుపు

దానిమ్మపం డెరుపు

తాంబూల మెరుపు

తా నెరుపు అబ్బాయి

తన వాకిలోన

౫

వానాలు కురవాలి
వరిచేలు పండాలి
మాకొట్లు నిండాలి
బుడుగో బుడుగో.
మాదాసి దంపాలి
మాయమ్మ వండాలి
మాబొజ్జ నిండాలి
బుడుగో బుడుగో.

౬

గుమ్మాడమ్మా గుమ్మాడి

తీగిపాకిందమ్మ గుమ్మాడి

పందిరెక్కిందమ్మ గుమ్మాడి

మొగ్గ దొడిగిందమ్మ గుమ్మాడి

పువ్వు పూసిందమ్మ గుమ్మాడి

కాయ గాసిందమ్మ గుమ్మాడి

పండు పండిదమ్మ గుమ్మాడి

పంచిపెట్టేరమ్మ గుమ్మాడి

౭

కోడీ కోడీ

కొక్కొరోకో

కాకీ కాకీ

కావు కావు

తెల్లవారింది

తెలివొచ్చింది

అమ్మ లెమ్మంది

ఆడుకొమ్మంది.

౮

మామయ్య పంపేడు మందలోకెల్లి
పాలేళ్లు తెచ్చారు పాలకావిళ్లు
బుడ్డిముంతలతోటి బుడిగావుపాలు
పదవమ్మ చెల్లెలా పట్టుకొద్దాము;
తోడు పాసెం తోడు
తోడుతే నీచెయ్యి వేడి
వేడివేడి పాసెం జుర్రు
జుర్రితే నీనోరు చుర్రు.

౬

ఇల్లలికి-ముగ్గెట్టి

ఆకేసి-పీటేసి

పప్పెట్టి-బువ్వెట్టి

పాలోసి-పెరుగోసి

అత్తారింటికి-తోవేదంటే

కితకితకితకిత-కిలకిలకిలకిల.

౧౦

ఏడవకు ఏడవకు వెఱ్ఱిఅబ్బాయి

యేడిస్తె నీకళ్లు నీలాలుగారు

నీలాలుగారితే నేజూడలేను

పాలైన గారవే బంగారుకళ్లు

—జో జో—

జోలల్లు పాడితే బాలలకు నిద్ర

నాగసరం పాడితే నాగులకు ఆట

జోలపూమిడిపళ్లు దూరానగలవు

జోడించి తెస్తాడు అబ్బాయిమామ

౧౧

కాళా గజ్జీ-కంకాళమ్మా
వేగూ చుక్కా-వెలగా మొగ్గా
మొగ్గా గాదు-మోటికినీరు
నీరూ గాదు-నిమ్మలవాయ
వాయా గాదు-వావింటకూర
కూరా గాదు-గుమ్మడిపండు
పండూ గాదు-పాపాయి కాలు
కాలూ దీసి-గట్టున బెట్టు.

౧౨

ఏనుగొచ్చిం దేనుగు

ఎక్కడ కొచ్చిందేనుగు

మావూరొచ్చిందేనుగు

మంచినీళ్లుతాగిందేనుగు

ఉప్పాడెళ్లిందేనుగు

ఉప్పునీళ్లుతాగిందేనుగు

౧౩

చిప్పిచిప్పిగోళ్లు

సింగరాజుగోళ్లు

మాతాతగోళ్లు

మండాపరాళ్లు

చుక్కచుక్కలగోళ్లు

సుందరమ్మగోళ్లు

ముచ్చటైనగోళ్లు

ముత్యాలజోళ్లు

౧౪

ఒప్పులకుప్ప
ఒయ్యారిభామ
పిలకుచ్చు
వాలు మొగ్గ
విస్తరంటు
ఈన పుల్ల
సన్న బియ్యం
చాయపప్పు
గూట్లోరూపాయి
నీ మొగుడుసిపాయి

౧౫

గుడుగుడుగుంచం—గుండారాగం

పాములపట్టం—పడగారాగం

అప్పల్రాజుగుఱ్ఱం—ఆడుకోబోతే

వేపేగుఱ్ఱం—పెళ్లికిబోతే

నీగుఱ్ఱం—నీళ్లకుబోతే

నాగుఱ్ఱం—పాలకుబోతే

కత్తెయ్యనా—బద్దెయ్యనా

పేణ్ణిళ్లా—చన్నిళ్లా

౧౬

చమ్మచక్క—చారడేసిబుక్క
అట్లుపొయ్యంగ—ఆరగించంగ
ముత్యాలచమ్మచక్క—ముగ్గులెయ్యంగ
రత్నాలచమ్మచక్క—రంగులెయ్యంగ
పగడాలచమ్మచక్క—పందిరెయ్యంగ
పందిట్లోమాఅన్న—పెండ్లిచెయ్యంగ
చాకలాడివాణికింద—జాజిపూలదండ
మొగిలదండ—ముత్యాలదండ
దండోదండ—దండోదండ

౧౭

గట్టుమీదాకోడి—గవ్వల్లాకోడి

త్రొక్కితే త్రొంభయ్యి—పిల్లల్లాకోడి

అల్లల్లాకోడికి—ఆకుమిరియంబు

పిల్లల్లాకోడికి—పిండిమిరియంబు

మాతాతకోడికి—మంచిమిరియంబు

అప్పల్లాలా—డిప్పలుముయ్యండి

ఆడుకోఁ—బుడుకోఁ—సంబారుబుడ్డి

౧౮

ఒకొ్క—వోచెలియా—రెండువోకళ్లు

మూడుముచ్చిలకా—నాలుగునందన్న

అయిదూవిటిగొలుసు—ఆరుంజవ్వాజి

యేడుంబేడీలు—యెనిమిదిమనమంద

తొమ్మిదితోకుచ్చు—పదిపట్టీడ.

=

౧౮

చేతులో వెన్నముద్ద

చెంగల్వపూదండ

భంగారు మొలతాడు

పట్టుదట్టి

సందిట కడియాలు

సరిమువ్వగజ్జెలు

చిన్నికృష్ణమ్మ

నిన్ను నేచేరికొలుతు.

౨౦

సీతమ్మనాకిటా చిరిమల్లెచెట్టు
చిరిమల్లెచెట్టేమొ చిగురు పూసింది
చెట్టుకదలాకుండ కొమ్మవంచండి
కొమ్మవిరుగాకుండ పూలుగోయండి
అందులో పెదపూలు దండగుచ్చండి
దండతీసుక వెళ్ళి సీతకియ్యండి
దాచుకో సీతమ్మ రాముడంపేడు
దొడ్డిగుమ్మంలోన దొంగలున్నారు
దాచుకో సీతమ్మ దాచుకోవమ్మ
దాచుకోకుంటేను దోచుకుంటారు.

